# సమాలోచన



జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

సంపుటము 3 | రాజమహేంద్రవరము 1-6-1980 | సంచిక 14, 15

—* ఈ సంచికలో *—



16—6—1980 సంచికలో కృష్ణశాస్త్రి ఊర్వశి సృష్టి, కామజిజ్ఞాస, దక్షారామము కవితా వైశిష్ట్యము, ఆధునికాంధ్ర సాహిత్యంలో బాలవర్ణన మొదలగునవి ఉంటాయి.




—* 1, 16 తేదీలలో ప్రచురింపబడును *—

చందా :
సంవత్సరమునకు రు. 10—00.
అర్థసంవత్సరమునకు రు. 5—50.

విడిప్రతి 50 పై.

★ సమాలోచన ★

* జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక *

సంపాదకుడు విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి

Retired Telugu Lecturer, V T J College, Rajahmundry

సంపుటము ౩ రాజమహేంద్రవరము 1-6-1980 సంచికలు 14, 15

# కళాపూర్ణోదయం - కల్పనావైచిత్రి

శ్రీ డా. వేదుల సుబ్రహ్మణ్యశాస్త్రి, ఎం ఏ, పిహెచ్ డి

తెలుగుకవులు తమ ప్రతిభాపాటవాల్ని వినియోగించి తీర్చిదిద్దగా ఏర్పడిన మధురకృతులు ప్రబంధాలు. అవి ఋషికల్పులైన పూర్వకవులు పవిత్ర సాహిత్య క్షేత్రాల్లో గావించిన తపఃఫలితంగా ప్రాప్తించాయి ఆ ప్రబంధ సాహిత్యంలో అతివిలక్షణమూ అతివిశిష్టమూ అయినది కళాపూర్ణోదయం మహాకవి పింగళి సూరన్న తత్కృతికర్త. ఆ మహనీయుడు ఆ మహాకావ్యంలో అనల్పమైన కల్పనావైచిత్రిని బహుధా ప్రదర్శించాడు

మహాకవి ప్రతిభాసంపత్తి నిరూపణకి కల్పనం నికషోపలప్రాయం ఉద్యానంలో చెలికత్తెలతో కలభాషిణి ఉయ్యాలలూగేటప్పుడు నారదునితో మణికంధరుడిలా అంటాడు

'తమిఁ బూఁదీఁగె తూఁగుటుయ్యెలలఁ బం
తాలాడు చుందూఁగు వా
కొమరుం బ్రాయపు గబ్బిగుబ్బెతల యం
ఘ్రుల్ చక్కగాఁ జాఁగి మిం
టి మొగంబై చనుదెంచు రీతిఁ గనుగొం
టే దివ్యమౌనీంద్ర వా
కమ్రగీ నేత్రి మీద కయ్యమునకున్
గల్ దాఁచులా గొప్పెడిన్

ఉయ్యాల లూగడంలో కాళ్లు ముందరికి చాచుకొంటూ వుండడం సర్వసామాన్యమైన విషయం కలభాషిణీ ప్రభృతుల కాళ్ళు చాచడం దేవకాంతలపై కయ్యానికి కాలుదువ్వేటట్లు వుండడం లోని కల్పనం అద్భుతంగా ఉంది దానికి నారదుడు భళిరా సత్కవి వౌదువని ప్రశంసించడాన్ని బట్టి కవికి కావలసిన కావ్యరచనా సామగ్రిలో కల్పనం అతిముఖ్యమైనదని పింగళి సూరన్న అభిప్రాయమని స్ఫురిస్తోంది

కల్పనావైవిధ్యానికి కళాపూర్ణోదయం ఒక చక్కని లక్ష్యగ్రంథం ఇతివృత్త స్వీకరణలోనూ సన్నివేశ ఘటనల్లోనూ రసపోషణలోనూ ఈ మహాకవి అనల్పమైన కల్పనా చమత్కృతుల్ని ప్రదర్శించాడు స్థాలీపులాక న్యాయంగా సమీక్షిద్దాం

కళాపూర్ణోదయాన్ని గూర్చి 'సిద్ధిద సారస్యలీలాచిత్రం బగు ప్రబంధము రచింపుము' అని ఆదేశించాడు తదనుసారంగా సూరన్న తానీకావ్యాన్ని 'అపూర్వ కథాసంవిధాన వైచిత్రీ మహనీయము' గా రచింపగడంగినట్లు చెప్పుకొన్నాడు మధురలాలస తన వృత్తాంతాన్ని చెప్పుకొనేటప్పుడు కూడా పంచమాశ్వాసంలో అది 'ఒక అపూర్వకథ, సముజ్జ్వల రసభావము' అని చెప్తుంది. అలాగే కథలో కూడా అక్కడక్కడ ఈ కళాపూర్ణోదయ కథ చిత్రమైనది, అపూర్వమైనది అని సూరన్న సూచిస్తాడు, అపూర్వకల్పనా విశేషాలతో కావ్యం చిత్రంగా కూర్పబడిందని పాఠకలోకం గుర్తించాలని అతని ఆశయం కాబోలు

కళాపూర్ణోదయ నామాన్ని బట్టి ఈ కావ్యంలోని కథ కళాపూర్ణుని ఉదంతం అని గుర్తింప వీలున్నది ఈ కళాపూర్ణుడు పురాణాల్లో ఎక్కడా కానరాడు లింగపురాణం దీనికి మూలమని కొందరన్నా కాదని నిరాకరింపబడింది ఈ కళాపూర్ణోదయ కథ అంతా సూరన్న గావించిన అభూతకల్పనమే కేవల కల్పనాకథలు కృత్రిమరత్నాలని ప్రజలు భావిస్తారన్న ఉద్దేశంతో ప్రజామోదాన్ని పొందడం కోసం-పురాణప్రసిద్ధాలైన సరస్వతీ చతుర్ముఖులు నారద మణికంధరులు వెంద లైన పాత్రలని ఆ మహాకవి తన కల్పిత కథలో ప్రవేశపెట్టాడు కథానాయకుడైన కళాపూర్ణుడు ఈ కవి బ్రహ్మసృష్టిలో అవతరించిన సిద్ధపురుషుడు అతని పుట్టుపూర్వోత్తరాలూ పరివారమూ కూడా సూరన్న కల్పనావిశేషానికి ప్రతీకలు సరస్వతీ చతుర్ముఖుల సురుచిర శృంగారగాథలు ఈ మధురకావ్యానికి కథాబీజం. అంతా సూరన్న సుందరకల్పనం తమ భవనారామ సరోవర సమీపంగా వున్న ప్రదేశంలో పితామహుడు వాగీశ్వరీముఖ చుంబన సౌఖ్యాన్ని పొందడమే కళాపూర్ణోదయకథగా కల్పింప

ఎడింది సకల కళాపూర్ణమైన శారదా దేవి ముఖమే కళాపూర్ణుడు అతడు స్వభావసిద్ధుడిచే పొందిన అరుణమణి, విల్లు, తూపులు అనేవి సరస్వతీదేవి పెదవి, కనుబొమలు, చూపులు అవి ఆమె ముఖంలో స్వభావసిద్ధంగా వుండడాన్ని స్వభావసిద్ధునిచే ఇవ్వబడ్డా యని చెప్పబడింది ఆ ముఖమండలి మందస్మితం అభినవకౌముదీ, ముఖాన్ని పొందగాలన్న చతుర్ముఖుని కోరిక మధురలాలసా, అనే పాత్రలుగా రూపొందింపబడ్డాయి ఈ కల్పనా విశేషాల నన్నిటినీ సూరన్న పంచమాశ్వాసంలో వివరించాడు.

వాణీపితామహుల చుంబనరూపమైన శృంగారచేష్ట ఒక కల్పనం. తదాధారంగా పాత్రలను కల్పించి కథను చిత్రించడం మరోకల్పనం అలాగే ఈకథలో చిలుక కలభాషిణిగానూ మళ్ళీ మధురలాలసగానూ, మణికంధరుడు కళాపూర్ణుడుగానూ, సుగాత్రీ శాలీనులు సుముఖాసత్తీ మణిస్తంభులుగానూ పరిణమించి జన్మాంతరాలలో వీళ్ళందరూ ఒకే కథలో పాల్గొని కథని నిర్వహించడం అతి విలక్షణమూ, అద్భుతమూ అయిన కల్పనం కథకి అతిప్రధానమైన వాణీపద్మజుల ఘట్టాన్ని పంచమాశ్వాసంలో చెప్పించి కలభాషిణి పాత్రతో కథని ఆరంభించడం అంటే కథని వెనుకనుండి మలచి ముందుకి త్రిప్పి నడిపించడం విచిత్రమైన కల్పనం అవతారికలో చేసిన వాగ్దానం ప్రకారం సూరన్న కథాసంవిధానాన్ని అపూర్వంగానూ చిత్రంగానూ కల్పనలతో మనోహరంగా నిర్వహించాడు

కథలోనిసన్నివేశాలు ఒకదానికొకటి సరిగ్గా అతుక్కొని పోల్చుకోలేని విధంగా ఏకత్వం పొందేటట్లు కల్పించడంలో సూరన్న ప్రతిభాసంపత్తి అంతా అభివ్యక్తమౌతోంది ఏసన్నివేశాన్ని తొలగించినా కథాప్రవృత్తి స్తంభిస్తుంది. సఖులతో కలభాషిణి ఉయ్యాల లూగడం, నారదమణి కంధరులు వాళ్ళని చూసి ప్రశంసించడం, రంభా నలకూబరులు ప్రశంసా వాక్యాలు వినడం, రంభ నారదునికి పరిహాసపూర్వకంగా అహంకారాన్ని వెల్లడించడం, నారదుడు సమాధానం చెప్పి కలభాషిణితో ప్రసంగించి శిష్యురాలిగా గ్రహించి గానరూప ప్రాప్తికి వరమిచ్చి అనంతరకథని నడిపించడం, మొదలైన ఘట్టాలు చక్కగా సహజంగా పొంది పొసగేట్లు కూర్చబడ్డాయి. అలాగే మణిస్తంభుడు స్వీయ ప్రయోజనసిద్ధికి అతడ్ని సేవించడమూ చమత్కారవంతమైన కల్పన మృగేంద్రవాహన కలభాషిణీ మణిస్తంభుల్ని సరిగ్గా రంభా నలకూబరు లుండే చోటికే విసరడం మనోహరమైన కల్పన మృగేంద్రవాహనాలయంలో మణిస్తంభ మణికంధరులు సుముఖాసత్తీ కలభాషిణులు విచిత్రంగా సమావేశమవడమూ వాళ్ళముఖతః శివి సగం కథ చెప్పించడమూ నాటకోచితమైన కల్పన ఈ విధంగా సన్నివేశాలన్నీ అపూర్వ కల్పనలతో సంఘటింప బడ్డాయి

పాత్ర చిత్రణలో కూడా సూరన్న చూపిన కల్పనా ప్రావీణ్యం గణనీయంగా వుంది కళాపూర్ణోదయంలోని కథని సుమారు ఇరవై అయిదు పాత్రలు నిర్వహిస్తాయి ప్రతిపాత్రలోనూ ఏదో ప్రత్యేకత ప్రస్ఫుటంగా గోచరిస్తూ వుంటుంది. సూరన్న కల్పనలలో వైవిధ్యం అనుపమంగా పోషింపబడింది ఏ రెండు పాత్రలూ ఒక్క విధంగా వుండవు ఒక్కలా వున్న రెండు పాత్రలలో భేదం రవ్వంతైనా గుర్తింపబడదు నిజమాయారంభా ఘట్టంలో నిజరంభ ఎవ్వరో నలకూబరుడు పోల్చుకో లేకపోయాడు నిజమాయా నలకూబర ఘట్టంలో రంభ తననలకూబరుణ్ణిగుర్తింపలేక ఎన్నో తికమకలు పడుతుంది. పాత్రపోషణలోని సూరన్న సామర్థ్యం నిజమాయారంభా కలహఘట్టంలో బాగా ఆవిష్కరింపబడింది ఇద్దరు రంభలూ పరమాశ్చర్యకరంగా పట్టుగా ఇలా దెబ్బలాడుకొన్నారు

'ఒట్టుసుమ్మీయన్న నొట్టుసుమ్మీ యటంచు
నేమేమియనిన నేమేమి యనుచుఁ
గానిగదే యన్నఁ గానిగదే యంచు
నింకేలయనిన నింకేలయనుచు
నోసిపోవేయన్న నోసిపోవే యటంచు
నౌనంటి వనిన నౌనంటి వనుచు
మఱువకు మిది యన్న మఱువకు మిదియంచు
నీవెంత యనిన నీవెంతయనుచు
నొకతె మగనికి నాసించు టొప్పదనిన
నొకతె మగనికి నాసించు టొప్పదనుచు'

స్త్రీస్వభావాన్ని నిశితంగా సమీక్షించి గ్రహించినవాడవడంచేత సూరన్న ఈవివాద ఘట్టాన్ని నిసర్గసుందరంగా కల్పించి నిర్వహించాడు నిజమాయా రంభానలకూబర ఘట్టాలలో స్త్రీపురుషులు స్త్రీపురుషులు గానే పోరారు పురుషుడు స్త్రీగాను, స్త్రీపురుషుడుగాను వినిమయం పొందడం మణిస్తంభుడు సుముఖాసత్తి అనే పాత్రలలో కనబడుతోంది అలా మారడమే కాకుండా సంతానాన్ని పొందడం అనూహ్యమైనకల్పనం సూరన్న కల్పనా దక్షత కిది పతాక వంటిది

పాత్రల స్వభావ నిరూపణలోనే గాకుండా రూపసౌభాగ్య చిత్రణంలో కూడా పింగళి సూరన్న తన కమనీయ కల్పనా ప్రావీణ్యాన్ని ప్రదర్శించాడని చెప్పడానికి సుముఖాసత్తి రూపసౌభాగ్యవర్ణనం ఒక్కటి సరిపోతుంది వార్ధక్యపరిపక్వమైన ఆమె రూపం ఇలా వర్ణింప బడింది

పసిమిపోకిండిన కసవుబట్టయుఁ బోలె
నరవెండ్రుకలఁ బర్వు శిరము వలన
నులిగొన్న చెందది పుర్వుల మాతివళ్లు సా
నము లెడు మోడుతో నక్కొలఁదల వలనఁ

గడుఁ జిట్టినట్టి బంగరు పూఁత బొక్కి బొల్లె
వడువుఁ జూపెడిమేని వన్నెల వలనఁ
దునిసి బ్రేకొను సోఁకు కునుకల కలపించు
బాహాకత్థోజలంబనము వలన
ఘూర్ణకరములు చాచ్చున ఘూర్ణకృత్తిఁ
దనరు ఘనకాక కహిఁకహిధ్వనుల వలన
భావజుఁడు కాల్చిపోయిన పాడుమేడ
పగిదిఁ గాన్పించు మణిగుడలి పడఁతి
యొకతె

మన్మథుడు కొంతకాలం వుండి కాల్చి పోయిన పాడు మేడలాగ ఆమె శరీరం వుందని పాడుమేడలో వుండే కసువుబట్ట సాలీళ్ళగూళ్ళు మొదలైనవి ఆమెశరీరంలోని అవయవవిశేషాలుగా వున్నాయని సాదృశ్యమూలకంగా అభివర్ణించి సూరన్న అనన్య సామాన్యమైన తన యనల్ప కల్పనా సామర్థ్యాన్ని నిరూపించుకొన్నాడు. ఆమె మణిస్తంభుని కత్తి దెబ్బకు ప్రాణాలు కోల్పోయి పూర్ణ యౌవనం పొందిన నాటి రూపాన్ని సూరనార్యుడు లోకోత్తర సౌందర్యరాశిగా కల్పించాడు మన్మథుని నివాసభవన మనిపిస్తూ వుంటుంది ఆరూప సౌభాగ్యం

రసపోషణలో కూడా సూరన్నగారి కల్పనా వైచిత్రి అపూర్వంగా ప్రకటితమైంది తాను ఈకావ్యాన్ని శృంగారరస ప్రాయంగా రచింపగడంగినట్లు పీఠికలో ఉట్టంకించేడు. చెప్పినమాటని అక్షరాలా పాటించాడు సరస్వతీ చతురాస్యుల శృంగారం ఆధారంగా కల్పింప బడిన కళాపూర్ణోదయ కథ శృంగార మయంగా వుంటుంది శృంగార రసపోషణలో అనుపోకని ఎంతో వైవిధ్యాన్ని కల్పించాడు ఒక్కొక్క జంటలో ఒక్కొక్క విధమైన శృంగారం కల్పింప బడింది సరస్వతీ ప్రజాపతుల శృంగారం ఆరాధ్యమైనది. కలభాషిణీ మణికంధరుల శృంగారం గురుశుశ్రూష కాలంలో అంకురితమై మాయారంభా నలకూబరుల స్థితిలో ఫలించింది చిత్రమైన శృంగారం. సుముఖాసత్తీ మణిస్తంభులు సుగాత్రీశాలీనులు అయినా వాళ్ళ శృంగారానుభవాల్లో అత్యధిక వ్యత్యాసం కనబడుతోంది మణిస్తంభ కలభాషిణులదీ కల్యాసురభి నవకౌముదులదీ రసాభాసానికి చక్కని అత్యాలు కేవలం ఏకత్రైవానురాగమే గోచరిస్తుంది కళాపూర్ణాభినవకౌముదుల శృంగారం పరాక్రమ సిద్ధమైనది ఇలా సమీక్షిస్తే శృంగార రసపోషణలో విభిన్నతను ప్రదర్శించిన సూరన్న కల్పనా కౌశలం ప్రశంసనీయం అనిపిస్తుంది

వర్ణనల్లో కూడా సూరన్న కల్పనా వైచిత్రి ప్రస్ఫుటమౌతోంది మణిస్తంభుడు సుముఖాసత్తితో దేశాంతర వస్తువిశేష సందర్శనానికి వెళ్తున్నప్పుడు గాంచినసముద్రం అతిలోకరమణీయంగా వర్ణింప బడింది ఆవర్ణనలోని దివ్యాపగా శ్లేషకల్పనం సముద్రాన్ని దర్శిస్తున్న సుముఖాసత్తీ మణిస్తంభుల మనోవృత్తుల కనుకూలంగా వుంది ఇతర వర్ణనలలో కూడా ఎన్నో కల్పనలు ప్రదర్శింప బడ్డాయి

కావ్యకళాపూర్ణోదయంగా పలువురిచే కీర్తింపబడ్డ కళాపూర్ణోదయం ఆద్యంతమూ పింగళి సూరనార్యుని అపూర్వ కల్పనా వైదగ్ధ్యాన్ని నిరూపిస్తోంది అద్భుత కల్పనా విశేషాలతో అట్టి మహా కావ్యాన్ని సంతరించి ఆంధ్రలోకానికి ప్రసాదించిన సూరన్న స్తవనీయుడు

(ఆకాశవాణి విశాఖ కేంద్రం వారి సౌజన్యంతో)

— —

మానవ మహనీయతా పరిమళాలను వెదజల్లిన

# 'పుష్పప్రమోదము' - ప్రయోజనాత్మకత

- శ్రీ డా జి బి ఎన్ ఆచార్య, ఎం ఏ, పిహెచ్ డి

'సమాలోచన' నాల్గవ సంచిక (16-12-77)లో శ్రీ జమదగ్నిగారి 'మూడు ఖండకావ్యాలు' (తులనాత్మక పరిశీలనము) అనే వ్యాసం ఒకటి ప్రచురించ బడింది అందులో వారు కరుణశ్రీగారి 'పుష్పవిలాపము'ను, వేదులవారి 'కాంక్ష' ను గరికిపాటి మల్లావధానిగారి 'పుష్పవివేకము'ను పేర్కొని విమర్శించారు పుష్పవివేకము' ఎంతో వుత్తమమైన కృతి అనీ, దానికి రావలసిన పేరుప్రఖ్యాతులు రాలేదనీ తమ విచారాన్ని వ్యక్తం చేసారు ఆటువంటి వుత్తమమైనదే మరోకృతి కూడా వున్నదని కవితాభిమానులకు తెలియజేయడమే ఈ వ్యాస రచనయొక్క వుద్దేశం అది శ్రీ ముప్పిడి సత్యనారాయణమూర్తిగారు (కౌముదీ పరిషత్తు సభ్యులు - విజయనగరం) రచించిన 'పుష్పప్రమోదము' అనే స్వల్ప పరిమాణంగల పద్యకావ్యం ఈ కావ్యం 1957 లో ప్రథమంగా ముద్రించబడింది 1965లో ద్వితీయ ముద్రణభాగ్యానికి నోచుకుంది దీన్ని కవిగారు కరుణశ్రీగారి 'పుష్పవిలాపము' నందలి పద్యములను ఒక హరిదాసుగారి ద్వారా విన్న తర్వాతనే రచించినట్లు స్వయంగా 'మనవి' చేసుకున్నారు 'పూవులు మానవులను శ్లాఘించినట్లు వ్రాసిన నెట్లుండునో యని యీ ఖండకావ్యము నుద్యమించితిని భాషయందుగాని, పాండిత్యము నందుగాని, నేను శ్రీశాస్త్రిలవారి కెంత మాత్రము సరికాజాలను కావున నా యత్నమును పెద్దలు పుత్రవాత్సల్యమున గ్రహింతురని యాశించుచున్నాను' అని సవినయంగా చెప్పటంచేత కవిగారి వుద్దే

ంతో పాటు, వుదాత్తవ్యక్తిత్వం కూడా
ల్లడవుతున్నది

'పుష్పవివేకము' కృతిని గురించి
చెప్పేటప్పుడు శ్రీ జమదగ్ని గారన్నట్లు
వెనుకటివ టికి ప్రతిక్రియగా వెలువడిం
న్న జన్మదోషం ఉన్నందువల్లా' ఈ
పుష్ప ప్రమోదము' కూడా కవితాలో
ంలో పొందవలసిన ప్రచారాన్ని,
ప్రాశస్త్యాన్ని, పొందలేకపోయిం దని
చెప్పవచ్చు, పదిహేను పద్యాలుగల ఈ
చిన్న కావ్యం శారదాంకిత మైనది కవి
గారు అంకితాన్ని పద్య రూపంలో
చేసారు_

పూవులఁ బూజసేయ మదిఁ
  బొంగి శుభంబుల గూర్పు మాతకో
పూవుల మోదరూపమగు
  'పుష్పప్రమోదము' నంకితంబుగా
దావక పాదసన్నిధిని
  ద సుఁడఁ జేర్చితి స్వీకరించి, నన్
దీవనలిచ్చి ప్రోవుమ! సుధీమణి!
  సుందరవేణి! భ రతీ!'

ఈఅంకితంలోనే తమ కావ్యప్రయోజ
నాన్ని సూచించారు పూవులతో పూజ
చేస్తేనే దేవతలు ఆనందించి శుభాల్ని
కలిగిస్తా రని తమ అభిప్రాయాన్ని వెల్ల
డించారు కాబట్టి పూవులను కోయటం
దోషం కా దనీ, వాటిని సద్వినియోగం
చేయటం ఎంతైనా అవసరమనీ కవిగారు
నిరూపించటం కోసమే ఈ కావ్యాన్ని
రచించినట్లు తెలుస్తున్నది

కావ్యాన్ని కవిశేఖర, ఉభయభాషా
ప్రవీణ బ్రహ్మశ్రీ పంతుల లక్ష్మీనార
యణశాస్త్రిగారు పరిష్కరించి, కృతి
కర్తకు 'ఆశీరుపాయనము'ను ప్రసాదించ
టం చేత కావ్యగౌరవం, కవివిశిష్టకృషి,
పాఠకులకు విదితం కాగల వని చెప్ప
వచ్చు ఇంకా ఈగ్రంథానికి గ్రంథకర్త
గురువుగారైన శ్రీ తాపలపాటి కృష్ణ
మూర్తిగారు 'ఆశీస్సు'ను, కరుణశ్రీగారు
శుభాకాంక్షలను తెలియజేసారు కరుణ
శ్రీగారు శుభాకాంక్షలను తెలియ జేయ
డం గొప్పవిశేషం దీనివల్ల కరుణశ్రీ
గారి సహృదయత గూడా వెల్లడవుతు
న్నది వారి శుభాకాంక్షలను యథాత
థంగా పాఠకులకు తెలియజేయడం
సమంజస మని తెలియజేస్తున్నాను_

గుంటూరు
1_2_61

'ఆర్యా! నమస్కారములు

తమరు దయతో పంపిన 'పుష్పప్రమో
దము' అనే కావ్యము అందినది ధన్య
వాదాలు తమ నిర్మలభావ సంపదకు
వందనములు తమలేఖకూడా ఈ రోజు
అందుకున్నాను తమ కవితాకుమారి విశ్వ
సౌభాగ్యపథములో పయనించి విశేష
విఖ్యాతి నార్జింపవలెనని కాంక్షించు
చున్నాను'

తమ
కరుణశ్రీ

తమకృతికి ప్రతిగా వెలసినప్పటికీ,
తమ అభిప్రాయానికి పూర్తిగాభిన్నమైన
అభిప్రాయం వెల్లడింపబడ్డప్పటికీ కరుణ
శ్రీ గారు శుభాకాంక్షలను తెలియజేయ
డం_అందులోను విశేషవిఖ్యాతి నార్జిం
చాలని కోరుకోవడం ఒకవిధంగా ఈ
కృతికర్త అదృష్టం ఏకొంతమందికోగానీ
వుండదు

'లోకో భిన్నరుచిః' అనే సూక్తినను
సరించి, ఒక్కొక్కరిహృదయం ఒక్కొ
క్కరుచిని ఆస్వాదిస్తుంది కరుణశ్రీగారికి
'పుష్పవిలాపము' ఇష్టంకాగా, శ్రీ
ముప్పిడివారికి 'పుష్పప్రమోదము' ఇష్ట
మైనది అక్కడి పూలు మానవులను
నిరసించి, దూషించాయి ఇక్కడిపూలు
పూలు మానవులను ఆదరించి, ప్రశంసిం
చాయి అది 'అహింసా' ప్రధానంకాగా
ఇది 'భక్తి' ప్రధాన మైనది

ప్రకృతిలో అతి మనోహరమైనవీ,
సుకుమార మైనవీ, పవిత్ర మైనవీ, ప్రేమా
స్పదమైనవీ పుష్పాలు అలాంటి వాటి
చేత విలపింపచెయ్యటం ఇష్టంలేని కవి
గారు ప్రమోదాన్ని ప్రకటింప చేసారు
అసలు భూమ్మీద పుట్టిన ప్రతిజీవీప్రయో
జనాత్మకమైనదే దేనిధర్మాన్ని అది
నిర్వర్తించటం, సంతోషంగా ప్రయో
జనాన్ని అందించటం అవసరం తమ
జీవితాన్ని సైతం త్యాగంచేసి, బతికిన
నాలుగురోజులూ ప్రయోజనకరంగా బత
కడాన్నే ఏజీవైనా కోరుకోవాలి అలా
కోరుకున్నప్పుడే ఆ జీవిజన్మ ధన్య మవు
తుంది ఈ సందేశాన్ని పుష్పాలద్వారా
మృదువుగా అందించారు కవిగారు

భగవంతుణ్ణి పూజించడం కోసం
పూలను కోయటానికి వనానికి వెళుతున్న
కవిగారికి దారిలో బుద్ధదేవుడి విగ్రహం
కనబడుతుంది ఆ బుద్ధుణ్ణి కవిగారు ఇలా
వర్ణిస్తారు_

'ఆకులలములు కోసిన_నగును హింస
యనియహింసనుబోధించు_ననఘుఁడతఁడు
గాన మదియందు నా కేదొ_కలతగల్గి
పూలు కోయంగ నప్పుడు_పోవ కేను'

వెంటనే ఇంటికి వెళ్ళి విశ్రమించిన
కవిగారికి కలలో ఒకసుందరోద్యానం
సాక్షాత్కరిస్తుంది ఆవనంలోని చెట్ల
పూలన్నీ ఝల్లున రాలిపోయి స్త్రీలుగా
మారి, తమను ఆహ్వానించి, చిగురుటా
కుల వేదికపై ఆసీనులను చేయగా ఆ
సుమకాంతలను వుద్దేశించి, ఏ వుపకా
రాన్ని కోరి మీరంతా నాకింతభక్తి
శ్రద్ధలతో సపర్యలు చేస్తున్నా రని
ప్రశ్నిస్తారు అప్పుడు ఆసుమకాంతలు_

'మీరొనర్చెడి యుపకృతి_ మించిమేము
గౌరవంబు ప్రదర్శింపఁగలమె యెందు
మాకుమానవులొనరించు _ మహితమైన
మేలు పెన్నంగఁ దరమానె యేల యనిన

అని సుదీర్ఘంగా, మానవులు తమకు చేస్తున్న మేలును ఎంతగానో కొనియాడుతాయి ఈ కొనియాడటంలో పుష్పాలకృతజ్ఞతాభావం ఎంతగొప్పదో వెల్లడవుతుంది అసలు తాము జన్మించటానికి, జన్మను సార్థకం చేసుకోటానికి మానవులే కారకు లని విశ్వసించటం విశేషం

'వాడి కృశించి క్రిందఁబడి
వన్నెయు వాసియుఁ బాసి మట్టితోఁ
గూడి నశింపనున్న మముఁ
గోరికతోడను సేకరించి మా
పోడిమిపోవనీక కడు
పూజ్యత మాకొనగూర్చి మెచ్చుచున్
వేడుకమీర దాల్తురు గ
ణించి స్వశీర్షములందు మానవుల్'

అని ఉత్కంఠతో మానవులను ప్రశంసించి పుష్పకాంతలు తమను సుగంధద్రవ్యాలుగా, సౌందర్యసాధనాలుగా తయారు చేయటానికి ఆనందాన్నే వ్యక్తం చేసాయి పైగా తాము గతించిన తర్వాతగూడా తమ కీర్తి పరిమళాలను శాశ్వతంగా నిలిపే మానవులు నిత్యమూ తమకుపూజ్యులే అని పులకించిపోయాయి తమజాతి వాళ్లందరూ చెట్టుకొకళ్లూ, కొమ్మకొకళ్లూ ఎక్కడెక్కడో వుంటే అందరినీ ఏరితెచ్చి ఒకదండగా గుచ్చి గౌరవనీయుల కంఠసీమలను అలంకరించి, తమకు ఎనలేని ఆనందాన్ని గూర్చే మానవులు మహనీయు లనీ, సలలితకీర్తి పాత్రు లనీ మెచ్చుకుంటాయి తమ వారందరినీ ఒకటిగా కలపగలిగిన 'సంఘటిత శక్తి' గల మానవులకు జోహార్లు అర్పించే వివేకాన్ని ప్రకటించటం ఎంతైనా విశేషం తమకుగూడా భగవంతుణ్ణి దర్శించాలనీ, పూజించాలనీ కోరిక లుంటాయట కానీ కాళ్లూ, చేతులూ లేకపోవటంచేత దీనంగా అశక్తతను వెల్లడిస్తాయట అలాంటి తమను దయతో భగవంతుడి సన్నిధికి తీసుకుపోయి తమకోరికను నెరవేర్చగలఉదారగుణం మానవులకు కల దని ఎంతగానో ప్రశంసిస్తాయి ముత్తైదువులైన స్త్రీలందరూ పుష్పాలను ధరిస్తారు అలా ధరించిన స్త్రీలకు సర్వకార్యములందూ మన్నన లభిస్తుంది పూలతోపాటు ముత్తైదువులకు, ముత్తైదువులతోపాటు పూలకు పూజ్యత లభిస్తుంది ఇది హైందవ సంప్రదాయం కవిగారు ఈ సంప్రదాయాన్ని ఎంతో చాకచక్యంతో కావ్యంలో ప్రవేశపెట్టారు సంప్రదాయాన్ని విస్మరించక మన్నించటం ఉత్తమ కవుల లక్షణం పూలను అన్ని వర్గాలవారూ ఆదరిస్తారని చెపుతూ ఆపూలతోనే_

'క్రూరమనస్కులౌ జనులు
కోమల మార్దవ చిత్తులౌ, నరుల్,
సారసపత్ర నేత్రల వి
శాల కటాక్ష విలోకనంబులన్
గోరెడివారు, పామరులు
కోవిదు, లార్యులు, భక్త శేఖరుల్,
శూరులు, వీరు లెల్లరును
జూపెదరెంతయు ప్రేమ మాపయిన్'

అని అనిపించారు చివరకు ఆసుమకాంతలు సుమాలుగామారి తమను పూజకు తీసుకువెళ్ళవలసిన దని ప్రార్థించగా, కవిగారు ఆ పూలను గ్రహించి, పూజకు వెళ్ళినట్లు కథను ముగించారు తాము ఆశించిన ప్రయోజనాన్ని సాధించడం కోసం చక్కనికథనుఅల్లి, నోరులేని పూలచే 'ఫలశ్రుతి'ని పలికింపచేసారు కవిగారి పద్యాలను పరిశీలించిన మీదట భాష సరళమైన దనీ, భావం సుకుమారమైన దనీ, శైలి రమ్యమైన దనీ చెప్పవచ్చును

ఈకావ్యంవల్ల ప్రత్యక్షంగా తమకు కలిగిన ప్రయోజనాన్ని కవిగారికి_శ్రీకాకుళం వాస్తవ్యులైన శ్రీసట్టాలకృష్ణ [illegible]

'శ్రీజంధ్యాల పాపయ్యశాస్త్రిగారి 'పుష్పవిలాపము' చదివి మామరదలు కరుపాం కాపురస్థులు శ్రీజామి జనార్దన స్వామిభార్య కృష్ణవేణమ్మ పూవులు ముడుచుకొనడం మానివేసినది తదుపరి తమరు రచించిన 'పుష్పప్రమోదము' మా స్నేహితుడు రేపాక సుబ్బారావువలన పొంది మా మరదలుకు ఇచ్చినాను అది చదివి మామరదలు చాల సంతసించి పూవులుమరల ముడుచుకొనుచున్నది '

దీన్నిబట్టి శ్రీముప్పిడివారు కరుణశ్రీగారిపై ఏదో పోటీకోసం వ్రాసినట్లుగాక, సరసమైన సందేశాన్ని అందించటంకోసం, ప్రమోదభరితమైన ప్రయోజనాన్ని సాధించటం కోసం విశేషంగా కృషిచేసారని చెప్పవచ్చు ప్రయోజనాత్మక కావ్యాలను రచించటం ఎంతైనా శ్రేయస్కరం ఆధునిక కాలంలోఎంతో మంది కవులు, ఎన్నోకావ్యాలను బండ్లకొద్దీ వ్రాసిపారేస్తున్నారు అన్నీ వెలుగులోకి రావటంకానీ, శాశ్వతంగా నిలిచిపోవటంగానీ జరగటం లేదు అలాజరగటం దుస్సాధం కూడాను కొన్నిమాత్రమే ప్రయోజనాత్మకాలై కవితాభిమానుల మన్ననలకు పాత్రమవుతున్నాయి అలా అవుతున్నకొద్దికావ్యాల్లో ఈ 'పుష్పప్రమోదము' కూడా ఒకటి కావా లనీ, కాగల దనీ ఆశిస్తూ, కవిగారిని అభినందిస్తున్నాను!!

ఆధునికంగా వెలువడిన పుష్పసంబంధమైన కావ్యాల్లో ఇంకా 'పుష్పవిలాసము', 'పుష్ప వినోదము' (వేరు వేరు కవులవి) అనేవికూడా వున్నట్లు గుర్తు ఇంకా ఎన్నో వుండి వుండవచ్చు 'పుష్పవిలాపము' నకు అనుకరణములైనప్పటికీ వేటియోగ్యత వాటి కుంటుంది అందుచేత సహృదయులు వాటినిగూడా పరిశీలించటం సమంజ[illegible]



# చేమకూర 'సారంగధర చరిత్ర' - సమీక్ష

— శ్రీ కె భద్రన్న, ఎం ఏ

క్షీణయుగముగా రూఢియైన 17 వ శతాబ్దములో మధురకవిత్వం చెప్పనేర్చిన కవి శిఖామణులందు చేమకూర వేంకట కవి చెప్పుకోదగ్గవాడు సారంగధర చరిత్రము, విజయ విలాసము ఇతని కావ్యాలు సారంగధర చరిత్రము నితడు గౌరన వ్రాసిన 'నవనాథచరిత్ర' మండి గైకొన్నాడు ఈ కావ్యమందు సారంగధరుని తండ్రి రాజరాజు ఆంధ్రమహాభారత రచనకు ప్రోత్సహించిన నన్నయ కాలపు రాజరాజు ఇతడు అని కొందరి యభిప్రాయము కాని ఈ కావ్యము నందలి కథ మాళవదేశములో జరిగినట్లున్నది వేంకటకవికి శృంగార మభిమానరస మని యతని కావ్యాలను బట్టి తేటతెల్లమగు చున్నది శబ్దాలంకారములపై ప్రీతి మెండు యమకానుప్రాసలు అప్రయత్నముగా నీతని కావ్యములందు దొర్లును జాతీయములైన పలుకుబడులు, సామెతలు ఈతడు సమయోచితముగా, మనోరంజకముగా వాడువాడు ఈతని కావ్యములను రఘునాథున కంకితమిచ్చినట్లు తెలియుచున్నది కవిరాజైన రఘునాథుని చేతనే 'ప్రతిపద్యమునందుఁ జమత్కృతిఁ' జెప్ప నేర్తు' వని పొగడబడినవాడు చేమకూర వేంకటకవి

మాళవదేశాన్ని రాజరాజు సుభిక్షంగా పాలిస్తున్నాడు

'ఏలె నారాజు కువలయ మింపుదనర
నాడి తప్పక భరత మర్యాద వెలయ'

అన్న పాదాలలో రాజరాజు యొక్క వ్యక్తిత్వము స్ఫురిస్తుంది తర్వాత కథా భాగమునందు తన కుమారుఁడు చేసింది నేరమే యని తలచిన రాజు తీసుకొనబోవు నిర్ణయమునం దాతనికున్న వ్యక్తిత్వమును కావ్యాదియందే పై 'ఆడితప్పక మర్యాద వెలయ' యన్న పదాలందు భాసించునట్లు భావికథా సంవిధానమందు తెలియజేసినాడు కవి

చేమకూర కవి శ్లేషలను వేయుటలో పెట్టింది పేరు సారంగధరుడు నోముల పంటగా పుట్టి దినదిన ప్రవర్ధమానుఁ డగుచున్నాడు అప్పు డాతని వర్ణన

'ఇనకర స్పర్శనంబున నింపుఁ గాంచి
చిన్ని సారంగధరుడు భాసిల్లుకరణి
నినకర స్పర్శనంబున నింపుఁ గాంచి
చిన్ని సారంగధరుడు భాసిల్లె నంత'

పై పాదము లందు ఇనకర స్పర్శనంబు అన్నదానికి సూర్యకిరణాలు, రాజుహస్త బలము అను రెండు అర్థములను, సారంగధరుడు అన్న పదానికి చంద్రుడు, కుమారుడు అను రెండర్థములను క్రమముగా గ్రహించినచో అర్థమునందలి చమత్కారము గోచరించును

చపలచిత్తలైన వనితలను గూర్చి 'వలపు మోసము, వావులుండవు సత్యరహితములైన వారి తలపులు మిక్కిలి చంచలములు,లని యట్టి కుటిలాలకల నమ్మరాదని, మంత్రి కుమారుడు సారంగధరుని హెచ్చరించునపుడు

'వలపు సట వ వులా నహి
యల సత్యమున్న తలపుల భ్రచ్ఛాయల్
తలదడవి బాసఁ జేసిన
జలజాక్షుల నమ్మరాదు సారంగధరా'

అని భోగకాంతల తత్త్వాన్ని వర్ణించాడు

బలవంతాన పినతల్లి చిత్రాంగి సారంగధరునిపట్ల మరులుగొని విడువకున్నపుడు సారంగధరుని మాటలు 'నీ కుమారుడను గదమ్మ' యనిన, చిత్రాంగి 'ఔను 'నాకు మారుడవె' యనుటలో నర్మగర్భోక్తిగా శ్లేష

యమకములందును నందెవేసిన చేయి వేంకటకవి మచ్చున కొకపద్యము

సారంగ నయన తన మన
సారంగను గౌగిలించియలరగ నపుడా
సారంగధరునిఁ గూర్పడె
సారంగధరుం డటంచు సారెం గలగున్

ఇందలి చమత్కారము 'సారంగ' యను వర్ణసమూహముతో ప్రాసగూర్చుట చిత్రాంగి సారంగధరుని నుద్దేశించి తలంచిన విధము వర్ణింపబడెను

సారంగధర చరిత్రమునందు మనకు అక్కడక్కడ ఈకవి జీవిత పరమార్థమును, వైరాగ్య తత్త్వమును కూడ బోధించినాడు

'కాయములుఁ గ మరు దిమిరపుఁ
ఛాయములుఁ దలంగు నస్థిరంబులు వీనిన్'
స్థాయిగ నమ్మి యకృత్యము
సేయగఁ బూనెదవు మీదిసెలు గెరుగవుగా

అని సారంగధరుడు చిత్రాంగి తన్ను బలాత్కరించగా అంటాడు

ఎక్కడి సుతు లెక్కడి సతు
లెక్కడ తల్లిదండ్రు లెవరికెవ్వరు కొన్నా
ళ్లక్కఱపడి తిరుగాడుదు
రక్కట యిది యంత మాయ యని
యెఱుంగవుగా!

కాళ్ళుచేతులు నరకబడిన తర్వాత బాధ పడుతున్న సారంగధరునకు ఆకాశవాణి ధైర్యోక్తులను పల్కుచూ చేసిన హితోపదేశ మిది

సారంగధరుడు శిక్ష ననుభవించిన తర్వాత రాజరాజు అడవులందు కొడుకుకై వెదకు సమయంలో యమకాన్ని ఎంత చమత్కారంగానో చేమకూర కవి ప్రయోగించాడు

కుసుమబాణుని నగజాలు కొమరు కొమరు
విభుడు మదిలోనఁ బాయని వెతకు వెతకు'

ఇందు కొమరు అన్నపదానికి కొడుకు, అందము అని వెతకు అన్న పదానికి బాధకు, వెదకుట యని అర్థాలు క్రమ

# గ్రంథ సమాలోచన

## క వి తా భా ర తి

(రచయిత శ్రీ వసంతరావు రామ కృష్ణారావు, ప్రచురణ విశాఖపట్టణం పోర్టు కల్చరల్ అసోసియేషన్, వెల రూపాయి

శ్రీ వసంతరావు రామకృష్ణరావుగారు పద్యరచనలో సిద్ధహస్తులు ఏ పదాలను ఏవిధంగా కవితలో వినియోగించుకో వాలో బాగా తెలిసిన రచయిత ఆకాశ వాణి 'సరసవినోదిని' కార్యక్రమానికు వీరు వ్రాసిపంపిన సమస్యాపూరణలు, దత్తపదులు, వర్ణనలు, మరికొన్ని కవితా ఖండికలు కలిపి ఈ 'కవితాభారతి' గ్రంథరూపాన్ని సంతరించుకొని మనకు సాక్షాత్కరిస్తున్నవి

మూడు, ఆరు, ఏడు, పది—అనుపదాలు సంఖ్యార్థంలో వచ్చేలా కాకుండా భార తార్థంలో ఇమిడేలా వీరువ్రాసిన పద్యం ఎంతో హృద్యంగా ఉంది ఆపద్యం ఇది

'మూడు'ను కీడు ధర్మపథ
మున్ విడనాడినవాని కెప్పుడున్
చూడగ 'నాఱు మూ' డగుచు
సోదర బాంధవ మిత్రకోటితో
నోడెనుయోజధనుండు, మఱి
యున్ తన 'కేడు'గ నైన కర్ణుడున్
పోడిమిమీఱి 'పది'కూలె రణ
భూమిని, 'ద్రౌపది' సంతసింపగన్

ఇందులో ఏడుకు ఏడుగడ అనే పదం, పదికి ద్రౌపది అనేపదం వాడుకోవ డంలో ప్రతిభ వ్యక్తం అవుతున్నది. అల్లాగే మరోపద్యంలో 'తమరు' అన్న అక్షరాలను అంత'మరు'త్సుతుండు అన్న పదంలో నిబద్ధించి ప్రయోగించడం వారి కవితాశక్తికి నిదర్శనం

వీరు పూరించిన సమస్యలు కూడ సర సంగా ఉన్నవి

'అన్నను భర్తగాఁ గొనిన
యన్నుల మిన్న యదృష్టరాశియా'
అనేసమస్య నెంతో సహజసరళంగా శ్రీరామకృష్ణరావు గారు పూరించారు చూడండి

కన్నియయౌ ర్తు కూర్మి చెలి
కత్తెఁ గనుంగొని పల్కెనిట్లు 'సం
పన్నుని పెండ్లియాడఁ దల
వందగునే? చెలి! పెండ్లియాడు ప్రే
మన్నను చూచునట్టిబుధ
మాన్యుఁడు, సాధుప సోదరుండు,మా
అన్నను భర్తగాఁ గొనిన
యన్నులమిన్న యదృష్టరాశిగా

అనవసరపు ఆర్భాటాలులేని పదా లతో, చెప్పదల్చుకొన్న భావాన్ని సుల భంగా సూటిగా చెప్పగల శక్తి ఈకవికి పుష్కలంగా ఉన్నది. వృత్తి రీత్యా వీరు 'పోర్టు'లో పనిచేసేవారే అయినా ప్రవృత్తిరీత్యా కవితాప్రవృత్తి గల బుద్ధిమంతులు

రచన చూస్తే - వీరు పద్యం వ్రాయ డానికి అట్టే శ్రమ, సమయం, తీసుకొనే టట్టుగా కన్పించదు. అది దైవదత్తమైన కళగానే మనకు గోచరిస్తుంది సాధా రణచ్ఛందస్సులే కాకుండ శిఖరిణి, స్రగ్ధర వంటి విలక్షణమైన ఛందోరీతులు కూడా వీరు సులువుగా రచించిపగల్గారు.

కొన్నింటిలో సమస్యలేలేవు ఆకాశ వాణి వారే అట్లాటివి ఇచ్చారు అవి కేవల పద్య పూరణలు మాత్రమే 'మకరసంక్రాంతి పర్వంబుమాన్యమగును' 'ఆరోగ్య మెముఖ్యభాగ్య మగు లోకము' వంటివి కేవలపద్య పూరణ నిమిత్తమే ఈ ఇబ్బంది అట్లాటివి పూరించడం వీరికి ఒక లెక్కలోనిది కాదు

11 వ పుటలో 2 వ పద్యం 'పోసని పల్కుకున్న నరగాహనమయ్యెను నాకు నీకథల్' అన్న పాదంలో యతి భంగము కన్పిస్తున్నది అది వారి భావతీవ్రత, రచనోత్సుకతల మధ్య ప్రమాదవశమున దొర్లిన పొరపాటు అని సరిపెట్టుకోవచ్చు ఎక్కడో అటగట 'నూతన్నవింత, నవీన సేద్యసాధనము, దీపావళీరేయి' వంటి సమాసాలు ప్రయోగింపఁబడ్డాయి అవి విచార్యములు

ఇప్పటికే వీరు అనేక రచనలు చేసిన కవులు, విమర్శకులు ఇతోధికమైన వీరి సాహితీకృషి సహృదయాంధ్రపాఠక లోకానికి మరింత ఉత్సాహాన్ని కల్గింప గలదు

— సుగుణారాధక

---

( 6 వ పేజీ తరువాయి )

ఈవిధంగా ఆంధ్రుల కత్యంత పరిచిత మైన సారంగధర కథను చేపట్టి వేంకట కవి తన యచ్చతెలుగు హృదయాన్ని ఆవిష్కరించాడు కావ్యమం దితని శైలి అమృతోపమాన మైనది లోకవ్యవహార మునకు సాధ్యమైనంత సన్నిహితంగా కావ్యశైలిని తీసికొని వచ్చుటలో చేము కూర వేంకటకవి ప్రయత్నించి కృత కృత్యు డయినాడు అనంతర ప్రబంధ యుగములో ఈ కవిరాజు చిరస్మర ణీయుడు

— • • • —

# తిక్కనగారి 'సకలబ్రహ్మ ప్రార్థన'

- శ్రీ కపిలవాయి లింగమూర్తి

పంచమవేదమైన మహాభారతరచనకు శ్రీకారం చుడుతూ నన్నయగారు "శ్రీ వాణీగిరిజా శ్చిరాయ దధతో వక్షో ముఖాంగేషు యే" అని త్రిశక్తులతో గూడిన త్రిమూర్తులను, అనంతరం

హరిహరరాజ గజాననార్కష
డాస్య మాతృసరస్వతీ
గిరిసుతాదిక దేవతాతతి
కిన్ నమస్కృతి జేసి

అని గజానన ఆర్క షడాస్య మాతృ సరస్వతులను నుతించినాడు కవి సంప్రదాయాన్ని బట్టి వీరిలో గణపతి సరస్వతులకు స్థానమున్నా అర్క షడాస్య మాతృకల కేమాత్రం స్థానం లేదు

తెలుగుదేశాన్ని పాలించిన రాజవంశాలను మతపరంగా చూస్తే నన్నయ నాటి వరకు వెలసిన వారిలో శాతవాహనులు వైదికులు తరువాత వచ్చిన యిక్ష్వాకులు మహాసేనాని భక్తులు వేంగిని పాలించిన శాలంకాయనులు చిత్రరథస్వామి పూజాధురంధరులు చాళుక్యులు మాతృగణపరిపాలితులు కల్యాణీ చాళుక్యులు ద్వైమాతురుని సేవకులు గనుక జైనబౌద్ధాలను నిరసించి వైదికాన్ని ఉద్ధరించదలచిన నన్నయగారు మతవికాసాన్ని అనుసరించి తన కాలంనాటికి వెలసిన ఆయా రాజవంశాల యిష్టదేవా లందరిని స్తుతించినట్లు తెలుస్తుంది

నన్నయగారి తరువాత వచ్చి భారత రచన చేపట్టిన తిక్కనగారి కాలంలో సాంఘికస్థితి మారింది జైనబౌద్ధాలు బలహీనమైపోవి వైదికాంతర్గతమైన శైవ వైష్ణవాలు సంఘంలో ప్రధానంగా నిలిచి పోట్లాడుటకు దిగినవి మరోవైపు శాక్తేయులు ఈ సృష్టికి మూలం శివకేశవులు గాదు దేవియే అని లేచినారు అంగువల

ఈ స్థితిలో తిక్కనగారి కొందరుదేవతలను స్తుతించడంకంటే వారిని సమన్వయంచేసి ఒక ధర్మాద్వైతాన్ని నిజమైన దైవతత్వాన్ని చెప్పవలసివచ్చింది ఆకారణంగా ఆయన

'శ్రీ యన గౌరినా బరగు
చెల్వకు చిత్తము పల్లవింప భ
ద్రాయిత మూర్తియై హరిహ
రంబగు రూపముదాల్చి విష్ణురూ
పాయ నమశ్శివాయ యని
పల్కెడు భక్తజనంబువైదిక
ధ్యాయిత కిచ్చు మెచ్చు పర
తత్త్వము గొల్చెద నిష్టసిద్ధికై'

అని హరిహరనాథుని సృజించి స్తుతించినాడు దీనితరువాత ఆయన మరెవరినీ స్తుతించక" అని "సకలబ్రహ్మప్రార్థనంబు జేసి" అని యనంతరవిషయాని కుపక్రమించినాడు దాన్ని చూస్తే మహాభారతమువంటి బృహద్రచనకు గంటంపట్టుకున్న తిక్కనగారు దైవస్తుతి యింత క్లుప్తంగా ముగించినాడేమా అనిపిస్తుంది

కావ్యారంభంలోని ఈస్తుతిని చూస్తే నన్నయగారిది ప్రాపంచికదృష్టి, తిక్కనగారిది పారమార్థికదృష్టి,అని చెప్పవలసి వస్తుంది నన్నయగారు తన స్తుతిలో మొదట త్రిశక్తియుతులైన సృష్టికర్తలను చెప్పి తరువాత రెండోపద్యంలో మళ్ళీ విష్ణువు, శివుడు, బ్రహ్మ, గణపతి, సూర్యుడు, కుమారస్వామి అనే పురుష దేవతలను వేరువేరుగా, సప్తమాతృకలు సరస్వతి పార్వతి అనే స్త్రీదేవతలను వేరుగా విభజించి నుతించినాడు ఇక తిక్కనగారు విధంగా గాక నన్నయగారి అడుగుజాడల్లో మొదటి రెండడుగులు మాత్రమే వేసినాడు ఆ తరువాత ఆయనగారి వేరు ఆయన [illegible] శ్రీ

పురుష భేదంగాని,శివకేశవాది నామాలు గాని, లేవు అతడు పరతత్త్వరూపుం నిర్గుణుడు నిరాకారుడైన బ్రహ్మం పై నామ రూపా లతని కౌపచారికాలు మాత్రమే గాని స్వతహాగాలేవు

తిక్కనగారి కాలంనాటికి సాధారణంగా స్మార్తులందరూ శైవులు విభూతి రుద్రాక్షలు ధరించేవారు అయినప్పటికీ విష్ణుదూషకులుగారు

శివాయ విష్ణురూపాయ
శివరూపాయ విష్ణవే
శివస్యహృదయం విష్ణుః
విష్ణోశ్చ హృదయం శివః
యథాశివమయో విష్ణు
రేవం విష్ణుమయ శ్శివః
యథాంతరం న పశ్యామి
తథా మేస్వస్తి రాయుషి

అని, ఇంకా,

ఆకాశాత్పతితం తోయం
యథా గచ్ఛతి సాగరం
సర్వదేవ నమస్కారః
కేశవం ప్రతిగచ్ఛతి

అని సంధ్యావందనాంతంలో భగవన్నమస్కారాభివందనలు చెప్పుకునేవారు కాబట్టి తిక్కనగారిలోని ఈ సంధ్యావందన నమస్కారమే హృదయంలో పరిపక్వమై నోటితో ఆ భగవంతుని 'కిమస్థిమాలాం కిము కౌస్తుభం వా?' అని అడిగించి హరిహరనాథ రూపకల్పన చేయించి ఉంటుంది

ఇక ఆమహనీయుడు కల్పించుకున్న హరిహరనాథునిపై వ్రాసిన ఒక్క పద్యమే సకలబ్రహ్మస్తుతిఏవిధంగాఅయిందో పరిశీలించండి

తిక్కనగారు చెప్పిన ఈసకలబ్రహ్మ కిక్కడ కళారూపంతో గూడిన బ్రహ్మమని, సకలమైన సాకారరూపాలు ధరించిన బ్రహ్మమని రెండువిధాలాతాత్పర్యం [illegible] ఉంది

తిక్కనగారి దృష్టిలో భగవంతుడు పరతత్వమేగాని పరమపురుషుడు గాడు జీవుని స్థితిగూడా అట్టిదే ఆదశయం దతనికి సంసారంగాని, సృజనాత్మకశక్తిగాని లేవు కాని అతడే దేహపరిగ్రహం చేసినపుడు డందుకు సమర్థు డౌతున్నాడు కనుక జీవుల సమిష్టిరూపమైన ఈశ్వరుని స్థితి గూడా అట్టిదే అతడు నిర్గుణుడు నిరాకారుడైనప్పటికీ సృష్టిరచన కుపక్రమించినపుడు సగుణత్వాన్ని సాకారత్వాన్ని పొందుతున్నాడు నిరాకారదశలో పరతత్వం లేదా బ్రహ్మం అనబడే అతడు సాకారుడైనపుడు శివకేశవాది నానారూపాలతో విలసిల్లుతున్నాడు

దేహధారియైన జీవునికి శిల్పరచనాశక్తి సంతాన సృజనశక్తి సహజాతంగా అలవడుతున్నవి వానిలో మొదటిదాన్ని అతడు వ్యష్టిగా నిర్వహిస్తున్నాడు రెండవదాని కతనికి స్త్రీసహాయం అవసరమాతుంది ఇదే నియమం సాకారుడైన ఈశ్వరునికిగూడా వర్తిస్తుంది ప్రకృతి సంయోగం లేక కేవలం పురుషుడే సృష్టికి సమర్థుడుగాడు ఈ విషయాన్ని ఆచార్య శంకరులు సౌందర్యలహరిలో ప్రప్రథమంగానే

"శివశ్శక్త్యా యుక్తో
యది భవతి శక్తః ప్రభవితుమ్
న చే దేవం దేవో న ఖలు
కుశల స్పందితు మపి"

అని ఉద్ఘాటించారు ఈకారణంచేతనే లోకంలో ప్రకృతిపురుషులు చైతన్యారోపంతో శివశక్తులై పూజాభాజనులైనారు సౌందర్యలహరిలో ఈశక్తి కళారూపిణిగా గూడా చెప్పబడింది కాబట్టి ఈ కళలోగూడిన బ్రహ్మము సకలబ్రహ్మమైనాడు

ఇక రెండో తాత్పర్యంలో సూర్యకిరణం పట్టకంచేత విశ్లేషం పొంది సప్తవర్ణ విశీర్ణమైనట్లు సాకారత్వంతో ఈశ్వరుడు శివకేశవాది నానారూప విరాజితు డౌతున్నాడు అపు డతని ప్రక్కనున్న ప్రకృతి వర్ణసన్నిధిలోని స్ఫటికంవలె పురుషుని అనుసరించి శ్రీగౌర్యాది నానారూపాలు పొందుతుంది ఇది ప్రకృతి పురుషుల తత్వం

ప్రకృతిపురుషుల ఈరూపవిన్యాసాల నాధారంచేసుకొనే నేడు మనలో అనేక మతాలు ఆవిర్భవించినాయి కాబట్టి ఏ మతం ఆవిష్కరించిన భగవద్బింబమైనా ఆపరతత్వాన్ని తెలుసుకునే అందుకు ప్రతీకగా రూపొందిందే అవటంచేతదంతి అడుగులో సమస్తజంతుతతి అడుగు లడగి యున్నట్లు తిక్కనగారు గావించిన పై పరతత్వ స్తుతిలో నన్నయగారు వేరు వేరుగా నుతించిన స్త్రీ పుం దేవతలంద రంతర్లీనమై ఉన్నారు

శివుడన్నా కేశవుడన్నా తిక్కనగారి దృష్టిలో ఆపురుషు డొక్కడే అలాగే లక్ష్మిఅన్నా మరెవరన్నా ఆదేవత ఒక్కతే ఈవిధంగా స్త్రీపురుష రూపాలతో కనిపించే ప్రకృతి పురుషులు నిజానికి వేరుగాక ఆ పరతత్వానిక రూపాలే కాబట్టి "శ్రీగౌరీ" నామాంకితమైన ఆ దేవికి మనోల్లాసం కలిగించే హరిహర నాథుని నుతించటంవల్ల అది రెండో తాత్పర్యానిక చెందిన సకల బ్రహ్మస్తుతి గూడా అయింది

భారత కవుల్లో ద్వితీయుడైన తిక్కనగారివిధంగా సకలబ్రహ్మరూపతత్వాన్ని అద్వితీయంగా ప్రథమ పద్యంలోనే ప్రదర్శించి లోకహితంకోసం కృష్ణద్వైపాయనుడు బోధింపదలచిన ధర్మాద్వైతాన్ని మనోహరంగా ఆవిష్కరించాడు

# చరిత్రలో పారశీక సాహిత్యము - 'ఉమర్‌ఖయ్యామ్'

- శ్రీమతి కొలచలమ శారద

ప్రాచ్యభాషలలో పారశీక సాహిత్యమునకు ప్రత్యేక స్థానము గలదు సూటిగా హృదయమునకు తాకునట్లున్న భావ సౌకుమార్యము ఇందులకు కారణము కావచ్చును పారశీక సాహిత్యమును రెండు భాగములుగా విభజింపవచ్చును

1 అరబ్బులు పారశీకమును జయింపక పూర్వమున్న సాహిత్యము-పురాతన శుద్ధ పారశీకము

2 అరబ్బుల పరిపాలనలో వారి సంస్కృతి నాగరికతలతో సమ్మిశ్రితమైనది ఆధునిక పారశీకము

సూక్ష్మగ్రాహులు, నాగరీకులు నగు పారశీకులు అరబీ పరిపాలనలో వారి భాష నేర్చుకొని రమ్యముగు కవితల్లల్లసాగిరి నన్నయనాటి తెలుగుభాష సంస్కృత పదభూయిష్ఠ మయినట్లుగా, పారశీక గ్రంథములలో అరబీపదములు చోటుచేసికొనినవి. సెల్జూకువంటి తురుష్క ప్రభువులు స్వజాతీయ ప్రత్యేకత నాదరింపక పారశీకులలో కలిసిపోయి వారి జాతీయతనే స్వీకరించి పోషించిరి అయిననూ బుద్ధిజీవులగు కొందరు పండితులు స్వభావమై అరబీ అధికారములవ జాతీయ గౌరవమునకు ఎప్పటికైనను భంగకరమని ఎంచిరి వారి ఆశయముల కనుగుణముగా శుద్ధపారశీకోద్యమము ప్రారంభమయినది ఈఉద్యమము పర్యవసానమే పారశీకమున భావకవితోద్యమమునకు అనువగు పరిస్థితులు కల్పించినది ఫిరదౌసి వంటి మహాకవు లుద్భవించి 'షానామా' మొదలగు రాజచరిత్రల నావిష్కరించిరి కాలక్రమమున పారశీక లవలంబించిన రాజనీతిజ్ఞతవలన అరబ్బుల పలుకుబడి అడగి, పారశీక స్వాతంత్ర్యవాయువు వీవదొడగినది ఇది సుమారు 10వ శతాబ్దినాటి పారశీక సాహిత్య

చరిత్ర. ఈ 10వ శతాబ్దము పారశీక చరిత్రలో సర్ణ్వయుగ మని చెప్పవచ్చును.

'ఉమర్ ఖయ్యాం', 'రుబాయత్'లు, 'ఫిరదౌసి', 'షానామా' 'రూమి' 'మస్నవి' మున్నగు రచనలు పారశీక సరస్వతికి అలంకారము లయినవి.

**ఉమర్ జనన కాలపరిస్థితులు :**

పారశీక నాగరికత పరిపూర్ణ వికాసములోనున్న 10వ శతాబ్దిలో ఉమర్ జన్మించెను. ఇతని సంపూర్ణనామము 'గియాసుద్దీన్ అబుల్ ఫతేహ్ ఉమ్రబిన్ ఇబ్రాహీమ్' కలము నామధేయముగా 'ఖయ్యాం' అని పెట్టుకొనెను. ఖయ్యా మనగా పారశీక భాషలో డేరాలు కుట్టిజీవించువా రని అర్థము. ఖయ్యామ్ తన కలము పేరుగా మాత్రమే ధరించెను కానీ, అతడు ఆవృత్తిలోని వాడు కాడని ఊహింపనగును. డేరాలు కుట్టి జీవించు సామాన్యమానవుడు మహాప్రతిభాశాలి అగు కవిగా, పండితుడుగా, విజ్ఞానశాస్త్ర వేత్తగా, గణిత జ్యోతిషాది శాస్త్రము లందారితేరి మహారాజులచే, ఆదర సత్కారము లందుట అంతగా విశ్వసింప రాని విషయముగా నుండును. జ్ఞాన పటాలమ్మును ఒడికమ్ముగ కుట్టుటయందు మాత్ర మీతడు సార్థకనామధేయుండ నుట సమంజసము. భారతీయకవుల చరిత్రలవలెనే 'ఉమర్' జీవితచరిత్రయు, అజ్ఞాతముగనే యుండినది. ఉమర్ గృహస్థజీవితమును గూర్చి తెలిసికొనుటకెట్టి ఆధారములు లేవు. ఉమర్ బాల్యావస్థను దాటి యౌవనమున అడుగిడు నప్పటికి పారశీకమున తిరుగుబాటు ఉద్యమము ప్రారంభమయినది. అరబు, గ్రీకు గ్రంథములందున్న భౌతికశాస్త్ర విజ్ఞానము మేధావుల, విద్యాధికుల, నాకర్షింపదొడగినది. మతాచారముల పై నమ్మకము సడల బారి మూఢాచారములుగా పరిగణింపబడసాగెను. హేతువాదమునకు ఆదరము హెచ్చినది. సహజ జిజ్ఞాసువగు ఉమర్ నకు ఈ పరిస్థితులు కవితాప్రోత్సాహ మొసంగినవి.

**3 ఖయ్యామ్ పాండిత్య విశేషములు :**

ఉమర్ ఖయ్యాం మహా ప్రతిభావంతుడు, విజ్ఞానవేత్త, గణితజ్యోతిషాదు లందు పరిపూర్ణప్రజ్ఞ నందినవాడు. ఇతనికి బాల్యమునుండియూ గణితము పై మక్కువ. జ్యోతిశ్శాస్త్రమునందు ఉమర్ మేటియై సమకాలికు లందరిలో విశేష గౌరవాదరము లందెడివాడు. అరబీభాషలో ఇతడు రచించిన అక్షరగణితము ప్రమాణ గ్రంథముగా పరిగణింపబడెడిది. ధాతురసాయన శాస్త్రము, జ్యామితికి వ్యాఖ్యానము - ఒక తత్త్వశాస్త్రము, రుబాయత్ మొదలగున వన్నియును ఉమర్ రచనలు. ఇతడు వైద్యశాస్త్రము నందును నిష్ణాతుడు, ఇంతటి మహావిజ్ఞానమునకు ఖనియై నిరంతర శాస్త్రచర్చలతో వైజ్ఞానిక విషయ నిరూపణలతో అలసిన మనసును సేదతీర్చుటకు అన్నట్లుగా వెలువడినవే, 'రుబాయత్'లు

బాల్యస్నేహితుడు, మంత్రిపదవి నలంకరించిన 'నిజాముల్ ముల్క్' ఆదరపూర్వకముగాఒసగిన జాగీరులవలన సకల భోగములు యధేచ్ఛముగా అనుభవించుచూ, శాస్త్రచర్చల పాల్గొనుచు, రాజాస్థానముల పండితగోష్ఠుల అగ్రేసరుడై, శిష్యులకు పాఠము చెప్పుచు ప్రకృతి రామణీయకత ననుభవించుచూ మానసికోల్లాసము కొలది ఇష్టమున్నప్పుడొక్కొక రుబాయి శిష్యులకు అనువుగా జెప్పుచు ఖయ్యాం నిర్విచారముగా కాలముగడిపెడివాడు. పారశీకభాషలో 'మస్నవి'-'కసీదా' 'ఘజల్' మొదలగు ఛందస్సు లున్ననూ ఉమర్ తన కవిత రుబాయిలతో సాగించెను. రుబాయి లనగా ఆంధ్రసారస్వతమునందలి ముక్తకములవలె వస్తు ఐక్యములేక వేని కవి ప్రత్యేకముగా భావపూర్ణములుగానుండు ఛందఃప్రక్రియ. ఇవి మన తేటగీతివలె నాల్గు పాదములలో నుండును. అర్థశతాబ్దమునకూ ఉమర్ భోగభాగ్యములతో, పేరుప్రతిష్ఠలతో నిర్విచారముగా కాలము గడపెను.

**4 ఉమర్ ఖయ్యాం కవితా తత్త్వము :**

జీవితముయొక్క క్షణభంగురత్వము, విధి నియంతృత్వము. పరమేశ్వరుని అస్తిత్వము ఖయ్యాం ప్రతిరుబాయిలోనూ చూపించెను. జన్మపరంపరలను మాత్ర మిత డంగీకరింపలేదు. దేవుడు సృష్టికర్త. కుమ్మరి కుండలుచేయునట్లు, సృష్టికర్త లోకములు సృజించును కుండపగిలిన వెనుక మన్ను మంటిలోకలసినట్లు శరీరము భూమిలో జీర్ణమగును. అమృత్తిక మరల వేరొక శరీరనిర్మాణమునకు వినియోగ పడును. ఇది ఉమర్ సిద్ధాంతము. కర్మానుభవము నీతడంగీకరింపడు. భౌతికపునరావృత్తి నీత డీవిధముగా తెల్పెను.

'జలజలమంజులార్భటుల
జాల్కొను నీ సెలయేటికోవలన్
మొలచిన లేతపచ్చికల
మోటుగ గాలిడబోకు దేవదూ
తలరుచిరాధరప్రకృతి
దాల్చిన సుందర మందగామినీ
లలితశరీర మృత్కణములం
జిగిరించె, ...

పునరావృత్తి నింతవరకు మాత్ర మంగీకరించెను.

సాఖీ అందించు ద్రాక్షాసవ మానుచు పచ్చిక బయళ్ళలో వెన్నెల విహార మొనర్చుచు ఉమర్ జీవిత క్షణికత్వమును గూర్చి అద్భుతములగు నగ్న సత్యములను అందించెడివాడు—

ఉదాహరణము :

'మన ప్రియజీవనంబు కుసు
మంబుల పోలిక జంచలంబుగా
వున బువులట్లు కాలమును
బుత్తుము నవ్వుల నాట పాటలన్
... .. ..
జీ, వనభరణ ప్రయాస మొక ప్రక్కకు
రువ్వద మోసి నెచ్చెలీ.'
'కను మెపుడో యకాండముగ
గాలమునీపయి దొమ్మిపోటు సే
యనియపుడే గులాబిజిగు
లారెడి ద్రాక్షరసంబు నానుమా
తనువునశించి దుమ్మగుట
తథ్యము.' ... ...

అని జీవిత నశ్వరత్వమును ఎలుగెత్తి చాటును.

'మానవు డొనరించు పాపపుణ్యములతని నంటవు. దేముడే మనస్సును అందు సంకల్పములను సృష్టించెను కనుక ప్రేరణ పుణ్యమయిననూ, పాపమయిననూ, ఆ దేవునికే చెందును. మానవుడు నిమిత్త మాత్రుడు' అని ఉమర్ బోధించెను. సృష్టి కాలనియమబద్ధ మయినది.

గతము గతమ్మె యెన్నటికి
గన్నులగట్టదు సంశయాంధసం
వృతము భవిష్యదర్థము వి
వేకవతీ యొక వర్తమానమే
సతతమవశ్య భోగ్య మగు
సంపద రమ్ము విషాద పాత్రకీ
మతమునఁ జోటులేదు.

—:—

ఆధునిక సాహిత్యంలో అంధయుగం ?

## ఉషఃకిరణాలు - ఒక ప్రామాణిక గ్రంథమేనా ?

— "చిత్రగుప్తుడు'

'1959-60 లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారి రెండువేలరూపాయల బహుమతినందుకొన్న గ్రంథము'-1 ఈ ఉషఃకిరణాలు. గ్రంథవిషయము 19 శతాబ్ది తెనుగు సాహిత్యచరిత్ర.' గ్రంథకర్త కీర్తిప్రతిష్ఠలు సంపాదించిన రచయిత. విమర్శకుడుగా, వ్యాసరచయితగా, ఆంధ్రదేశంలో ఆయనను ఎరుగని అక్షరాస్యుడులేడు'-2 అని విశ్రాంతాచార్య పింగళి లక్ష్మీకాంతం గారిచే పరిచయము చేయబడిన యండమూరి సత్యనారాయణరావు. ఎకడామీవారి బహుమతి ఫలితముగా పండిత సభలు, పత్రికలు ప్రశంసాపరంపరల, నీ గ్రంథకర్తపై కురిపించినవి. విశ్వవిద్యాలయములు యం. యే. డిగ్రీ కోర్సులో ఋక్స్ రికమెండెడు ఫర్ స్టడీ' క్రింద నీ గ్రంథనామ ముదాహరించినవి ఇక కావలసినదేమున్నది? గ్రంథప్రచారమునకు- గ్రంథకర్త కీర్తి ప్రతిష్ఠలకు ?

నాపరిశీలన ప్రకారము 20 వ శతాబ్దిని వెలువడిన దోషభూయిష్ఠమైన విమర్శన గ్రంథములలో దీని కిదేసాటి.

- గ్రంథకర్తకున్న ఆశయము, అనుసరించిన విధానము పొందు పొసగు నట్టివి కావు.

'తెనుగు సాహిత్యచరిత్రలో కవుల కాల నిర్ణయము జన్మతిథి, జన్మస్థలము, కర్తృత్వము, నామకరణము మొదలయినవన్నియు వివాదగ్రస్తవిషయములే. అయినను నేడు చాల వివాదములు తీరిపోయినవి. ఎన్నో విషయములు నిర్ధారణములయినవి'- పుట. 9.

నిర్ధారణములైనవిగదా! అయినచో క్రిందివిపర్యాసము లెందుకీ గ్రంథమున ప్రవేశించినవి?

పుట. 109. '19 వ శతాబ్ది ప్రారంభములో పిడపర్తి కవులు బసవన రచించిన దీక్షబోధ ? (దీక్షాబోధ యనుటకు)ను సోమనాథులు రచించిన ప్రభులింగలీలను తెనుగు లోనికి అనువాదములు చేసిరి'. అనువాదములు చేయుట ఏమి? అవి తెలుగ గ్రంథములే.

పిడుపర్తి కవులలో బసవన, సోమనాథులు. తండ్రీ బిడ్డలు. 1 పిడుపర్తి కవులే బసవసోమనాథులు'. పిడుపర్తి కవులు వేరని బసవసోమనాథులు వేరని గ్రంథకర్త తలపు. దీక్షాబోధకర్తగా తండ్రి బసవనయు, పద్యబసవపురాణ, ప్రభులింగలీలల కర్తగా సోమనాథుడును ప్రసిద్ధులు. కన్నడమున చామరస రచించిన ప్రభులింగలీలలను సోమనాథుడు తెనుగునకుఁ దెచ్చెను చామరసు క్రీ. శ 1423-46 సంవత్సరముల నడుమ విజయనగరము నేలిన ప్రౌఢదేవరాయలకాలమువాడు.

కనుక సోమనాథు డప్పటికి తరువాతివాడు కావలెను. సోమనాథుని తండ్రి బసవనను దేవాంగ చరిత్ర (ద్విపద) కర్త యగు భద్రకవి లింగకవి యిట్లు స్తుతించినాడు.

'ఘనవీరశైవ దీక్షాసమగ్రుండు
వినుతి పరబ్రహ్మ విజ్ఞానమూర్తి
పరమకృపారస భరితాత్ముఁ డనఁగఁ
బరగిన పిడుపర్తి బసవేశుదివ్య
పదములు నిర్వాణపదము లౌ ననుచు
వదలక భజియించి.'

లింగకవి క్రీ శ 1530_42 సం॥ నడుమ విజయనగరము నేలిన అచ్యుతదేవరాయల నాయకుడైన 2 కాళహస్తి నాగకుని కోరికపై తన గ్రంథమును రచియించి నట్లు చెప్పినాడు. లింగకవికి స్తుతి పాత్రుడైన బసవనఅంతకు ముందు వాడు కావలెను బసవన క్రీ శ 1142 నకు ముందువాడని తెలియుటచేత తండ్రి కుమారు లిరువురు క్రీ శ 1100_1000 ప్రాంతముల వారని నిశ్చయింపవచ్చును అప్పుడు పిడుపర్తికవులు 19 వ శతాబ్ది వారెట్లగుదురో కథాశేషుడైన గ్రంథ కర్తకే తెలియును 3

శ్రీమన్మహాదేవ సేవానుభావ
కలగుచుం డగు పాలకురికి సోమేశుఁ
డెలమిఁ జెప్పిన కృతు లిల వెలయించి
భవదీయ జనకుండు బసవనార్యుండు
సవిశేష భాష దీక్షాబోధఁ జెప్ప
బసవపురాణంబు పద్యకావ్యముగ
రసికులౌనన మీరలు చేసినారు
 - ప్రభులింగలీల (ద్విపద) D 910

చామరసు ప్రభులింగలీల

'ఇది పాల్కురికి సోమనాథుని తెలుగు ప్రబంధమగు ప్రభులింగలీలకు కన్నడీకరణము కావచ్చును'

శేకమళ్ళ అచ్యుతరావు - విజయనగరసామ్రాజ్యమందలి ఆంధ్రవాఙ్మయ చరిత్ర - పుట 302 ముద్రణ 1938(?)

పాల్కురికి సోమన ప్రభులింగలీలలు వ్రాసిన ట్లీవరకు లోకమెఱుగదు అచ్యుతరావుగారి వ్రాత కాధార మిటో? గ్రంథకర్త రెండవ అభిభాషణ

'తెలుగు సాహిత్యములో పద్యకావ్యములు కాని గద్యకావ్యములు గాని చక్కగా పరిశీలించికొని యందలి ప్రత్యేక విశేషములను, కథాసంవిధానమును, పాత్రచిత్రణమును, సమకాలిక జీవిత రూపచిత్రణమును, 'పరికించు ప్రయత్నమే జరుగలేదు' (పుట 327)

వీరిగ్రంథములో అట్టి ప్రయత్నము జరిగినదా? చూడుడు

7 పుట 'శేషయ్యగారు తమ ఆంధ్ర కవి తరంగిణిలో పెక్కురు 19వ శతాబ్ది కవుల జీవితములను గూర్చి వ్రాసిరి కాని వాఙ్మయ చరిత్ర యెక్కువ స్పృశింపలేదు'

శేషయ్యగారి ఆంధ్రకవితరంగిణి 12 వ సంపుటము వరకు 1977లో ముద్రితమైనది ఇందు 16, 17 వ శతాబ్ది కవుల చరిత్రలు కలవు కవిచరిత్రల యందు వాఙ్మయచరిత్ర యుండరాదని వీరి తలంపుగాబోలు వంగూరి సుబ్బారావు గారి వంటి మొదటిపరిశోధకులు, వాఙ్మయచరిత్ర కవులచరిత్ర వేరువేరుగా ప్రకటించిరి దాని రచనాప్రణాళిక వేరు వీరేశలింగం పంతులు, శ్రీరామమూర్తి, శేషయ్య, సుబ్బారావు గార్లవి కవిచరిత్రలు సుబ్బారావు, నారాయణమూర్తి, నాగేశ్వరరావు, వేంకటరావు వేంకటావధాని, లక్ష్మీరంజనం వేణుగోపాలస్వామి (సం), జోగారావు, రామరాజు, వీరివి వాఙ్మయచరిత్రలు నారాయణరావు, జోగి సోమయాజి, భాస్కరరావు - వీరివిభాషాచరిత్రలు ఒకపుస్తకములో వేటొకవిషయ మాసించుట భ్రాంతిమూలకము

6 పుట 'నన్నయ యుగములో శైవ కవులయిన నన్నెచోడుని పాల్కురికి సోమనాథుని చేర్చటంలో ఆ యుగధర్మములు లక్షణములు పూర్తిగ సమీక్షించుటలేదు'

నన్నెచోడుని నన్నయయుగములోనే కాక నన్నయకు పూర్వయుగమున చేర్చి సమీక్షించిన వారు కలరు సోమనాథుని నన్నయయుగములో చేర్చి సమీక్షించిన వారు లేరు.

101 'ముమ్మడి కృష్ణరాయలు (1794 1868) కన్నడమున గద్యరచనలు చేసిన తొలిగ్రంథకర్త' ఇది గ్రంథకర్త విన్న వాక్యము క్రీ శ 920 ప్రాంతమున శివకోట్యాచార్య విరచిత వడ్డారాధన మను జైనమత గ్రంథము, 978 లో చావుండరాయని త్రిషష్టిలక్షణ మహాపురాణము కన్నడమున వెలసిన తొలి గద్య కృతులు చిక్కదేవరాయ (1672_1704) తిరుమలాచార్య (1647_1706) మొదలగువారు కృష్ణరాజుకంటె ముందుగనే వచనగ్రంథములు వ్రాసిరి బసవాదుల వచనగ్రంథ ముక శాఖగా వెలువడినది

కావున ముమ్మడి కృష్ణరాయలు తొలి గద్యకర్తకాడు

67 'సంస్కృతము నేర్చుట కుపాధ్యాయులు అమరము శబ్దములు చెప్పుకొని, క్రమముగా రఘువంశము, కుమారసంభవము, మేఘసందేశము చదువుకొని, భారవి, మాఘమువంటి పంచకావ్యములను వ్యాఖ్యానముతోకూడ వల్లెవేయుట పరిపాటి'

పంచకావ్యము లనునేవియో విస్పష్టముగా తెలియక వ్రాసినవ్రాత పై నుదాహృతములైన కాళిదాస కావ్యత్రయము, భారవికిరాతార్జునీయము, మాఘకవి శిశుపాలవధ పంచకావ్యములు

ఈవిధముగా తప్పులకు గనియైన యీ గ్రంథమును విమర్శించుట గొంగళిలో వెంట్రుక లేరుట వంటిది విశ్వవిద్యాలయ విద్యార్థుల కుపయుక్త గ్రంథ మగుటచే నింతగా వ్రాయవలసివచ్చినది వీరిగ్రంథ చౌర్యము బాహాటము తెలుగుసంస్కృతి నుండి యెత్తి తమగ్రంథము గంపలతో నింపుకొనిరి [illegible] సంప్రదాయ



ముల శీర్షిక (౦౦_64) దీనిని తెనుగు సంస్కృతి 573 పుటనుండి పోల్చుకొనునది. అట్లు యెత్తి వ్రాసుకొన్న భాగము

'తెనుగు సాహిత్యముపై ఆంగ్లభాషా ప్రభావము అను పరిశోధన గ్రంథము 120-121 పుటలలో నీ వాక్యములు గమనింపుడు

'కాంబెల్ దొరయొక్క యభిప్రాయము తెనుగుభాషాపరిశోధనలో నవ్యమార్గము నకు దారితీసినది ఎల్లిస్ బహుభాషావేత్త. కాంబెల్ దొర సూచనప్రాయముగ చెప్పిన దానిని తెలుగు భాష సంస్కృత భాషనుండి పుట్టినది కాదనియు, తమిళము మొదలైన భాషలలోనే దాని కెక్కువ సంబధము, పోలిక కలదని నిరూపించెను '

ఈ వాక్యములు ఉపకీరకోల గ్రంథకర్త పేరు చెప్పకయే ఈ క్రిందివిధముగా దోచుకొనెను

316 పుట 'కాంబెల్ దొర యొక్క అభిప్రాయము తెనుగు భాషాపరిశోధనమునకు క్రొత్తమార్గము చూపినది ఈ యభిప్రాయము బలపరచినది మరొకపండితుడు ఫ్రాన్సిస్ ఎల్లిస్ ఈ ఎల్లిస్ బహుభాషావేత్త కాంబెల్ దొర సూచనప్రాయముగ చెప్పిన దానిని తెనుగుభాష సంస్కృతభాషనుండి పుట్టినదికాదనియు తమిళము మొదలయిన భాషలలోనే దాని కెక్కువ సంబంధము కలదనియు నిరూపించెను '

పై ఇరువురి అభిప్రాయములు ప్రమాణములు గావు బర్నెలు పండితుడు

'It proves that before 1816 Mr Ellis had already for-seen the possibility of Comparative Philology not only as regends the socalled Aryan tongues but also in respect of Dravidian He must then in future be considered as one of the originutors of one of the most remarkable advances in sceince in this country'[4] అని చెప్పుటచే ఎల్లీస్ తెనుగుభాష ద్రావిడసంబంధియని తెల్పుటలో మొదటివాడని తేలుచున్నది మరియు Burrew Emenan ద్వయము కూర్చిన ద్రావిడభాషా నిఘంటువు తొలిపలుకులోని తొలివాక్యము బర్నెలు అభిప్రాయమును బలపరచినది ఇంతయెందుకు కాంబెల్ దొరయే తన వ్యాకరణమున -

'In suppori of what I have ventured to advance, in the preceding introduction on the subject of the structure and derivation of the Teloogoo language it is peculiarly gratifying to me to be allowed to quote the high authority of my friend Mr Francis W Ellis'

అని వ్రాయుటచే ఎల్లీసు తనకీ విషయమున ప్రామాణికుడు కనుకనే Ellis దొరయొక్క Dessertation of Teloogoo అను గ్రంథమును కాంబెల్ తన వ్యాకరణపుపీఠికలో 'Note' అని చెప్పి చేర్చుకొన్నాడు

109 '18వ శతాబ్ది చివరి భాగములో మైసూరు నేలిన కంఠీరవ నరసరాజు తెలుగునను, సంస్కృతమునను యక్షగానములు రచించెను'

17 వ శతాబ్దిలో మధుర తిరుమల నాయకునితో పోరిన కంఠీరవ నరసరాజు మద్దాలి కంఠీరవరాజు కొడుకు ఇతడు మైసూరును పాలించెడు ఇతని కాలంలోనే War of Nozeo జరిగింది

ఇక 18 వ శతాబ్దిలో చినదేవరాయల కొడుకు కంఠీరవరాజు యక్షగానకర్త కంఠీరవనరసరాజు, కంఠీరవరాజు ఒకరు కారు ![5]

122 పుట అడిదము సూరకవి 18వ శతాబ్ది చివరిపాదము లోపుట్టి, 1799 లో జరిగిన పద్మనాభయుద్ధమును జూచి 19వ శతాబ్ది ఆరంభమువరకు కృతులు రచించిన ప్రథమ కవి అడిదము సూరకవి దీనికి ప్రత్యుత్తరమును 'అడిదము సూరకవి జీవితము' నుండి ఉదహరించుచున్నాను (సూరకవి) 'ఇతని జననము క్రీ శ 1720 ప్రాంతము 1794 వ సంవత్సరమున బద్మనాభయుద్ధములో వీరస్వర్గమును గాంచిన తన ప్రభువగు రెండవ గజపతి మహారాజులుం గారికంటెఁ దొమ్మిది సంవత్సరములు ముందుగ ననఁగా 178౦ వ ప్రాంతమున నీకవివరుఁడు కీర్తిశేషుఁ డయ్యెను '[6]

సారాంశము సూరకవి 18వ శతాబ్ది తొలిపాదములో పుట్టి, చివరిపాదములో మరణించెను గ్రంథకర్తవి తప్పు లెఖలు పద్మనాభయుద్ధకాలము 1794 జూలై 10 ఉదయ మని సూరకవి గ్రంథకర్తలు

తెలిపియున్నారు గ్రంథకర్త ఈ పుట లో పేర్కొనిన 1799 తప్పు 40 పుట లో పేర్కొనిన 1974 సరి

(సశేషము)

---

1 ఉపఃకిరణాలు - 19వ శతాబ్ది తెలుగు సాహిత్యచరిత్ర - అట్టపై వాక్యము గ్రంథము పుటలు 301 ప్రకాశకులు ఉత్తమ సాహితి-మాణిక్యభవన్, రామచంద్రపురము పున్నమ్మతోట, విజయవాడ తొలిముద్రణ అగష్టు 1960 వెల 6 రూ

2 పింగళివారి తొలిపలుకు-1

3 దేవాంగ చరిత్ర, డి 949

(ప్రాచ్య లిఖితశాల, మద్రాసు)

'ఇతడు (పాల్కురికి సోమన) ప్రథమ ప్రతాపరుద్రునికి సమకాలికుడని క్రీ శ 1222 ప్రాంతపువాడగు పిడుపర్తి సోమన తన పద్య బసవపురాణములో నుడివియున్నాడు' - తెలుగు సంస్కృతి పుట 586 ఇది పొరబాటు క్రీ శ 1022 కు బదులు 1222 అని అచ్చు పడియుండును

4 Indian Antiquary vol VII 1878 పేజి 287 ఈ విషయమును తెలుగువారికి తొలుత తెలుకపరచిన వారు కళాప్రపూర్ణ నిడుదవోలు వేంకటరావుగారు

5. ఈ పొరబాటు ఆరుద్రగారు కూడా చేసేరు స ఆ సా ×11 పుట 76 పైగా ఆరుద్రగారు దక్షిణదేశీయాంధ్ర వాఙ్మయము పుటలు 408-464 అని చూపేరు కాని ఆ పుటలలో నున్నవాడు కంఠీరవనవరసరాజు కాదు కంఠీరవరాజు డాక్టరు యస్వీజోగారావు గారి యక్షగాన వాఙ్మయచరిత్రలోని శీర్షిక యున్నట్లే యున్నది

6. అడిదము సూరకవి జీవితము - అడిదము రామారావు పుట 54 వావిళ్ళ - 1950.

# ఈ పక్షంలో

నమూనా మునిసిపల్ కౌన్సిలు సమావేశము

మే 18 తే ఆదివారంనాడు రాజమండ్రిలో నమూనా మునిసిపలు కౌన్సిలు సమావేశం జరపబడింది మాజీ మునిసిపలు చైర్మనులు, మాజీకౌన్సిలర్లు తదితర ప్రముఖులూ అనేకులు ఈ సమావేశానికి హాజరైనారు కొన్ని తీర్మానాలు చేయబడినవి రాబోయే మునిసిపలు బడ్జెటులో ఈ తీర్మానాలలోని కొన్ని ముఖ్యాంశాలు చేర్పవలసినదిగా విజ్ఞప్తి చేయబడినది ఇది ప్రభుత్వానికి గాని, అధికారులకు గాని, వ్యతిరేకముగా ఏర్పడిన సమావేశం కాదని పునః పునః చెప్పబడింది

కొన్ని ప్రసంగాలు ఆ అంశాన్ని ధ్రువపరుస్తాయా అని సందేహం కలగక పోదు ప్రస్తుత మునిసిపలు కమిషనరు అండ్ స్పెషల్ ఆఫీసరుగారు ఉత్సాహవంతులై పౌరహిత కార్యాలు అనేకం సాగిస్తున్నమాట అయథార్థం కాదు వానితోపాటు కొన్ని లోపాలూ, తత్ క్షణ పరిష్కార యోగ్యము లయిన అనేక సమస్యలూ, ఉండక పోవు వాటి సాధనకై ఇటువంటి సమావేశాలు ఎంత వరకూ దోహదం చేస్తాయో వేచి చూడవలసి యున్నది పట్టపగలు చెంగులాగితే ఫలితం లేనిది అర్ధరాత్రి కనుసైగ చేస్తే ఏం ప్రయోజనం అన్నసామెత బాగా ఆలోచించదగినది పురపరిపాలనలోని లోపాలనీ, తత్ క్షణావసరాలనీ, సూటిగా వివరించి అందుకు బాధ్యతవహించవలసిన వారితో సహకార- పోరాటాలను జరపవలసిన ప్రజాశక్తి అవసరమై యున్నది అలాకాక వ్యంగ్యమర్యాదతో - వ్యంగ్య ప్రయాసలకు లోనై - తీర్మానాలు చేయడం అదొక మంచి వినోదకార్యక్రమం కావచ్చు

ఈమధ్య 'భువనవిజయాలూ' 'మనుమసిద్ధి కొలువు కూటాలూ', చూచి వినోదిస్తున్నాం కదా.

సమావేశంలో నమూనా మునిసిపలు కమిషనరు ఈ నాటకంలో తమపాత్రవి వివరిస్తూండగా 'నాటక' ప్రయోగాన్ని కొందరు సదస్యులు బలంగా ఆక్షేపించడం పెద్దల కలహాపై ఆ మాటలు ఉపసంహరింపబడడం ప్రస్తుత ప్రజాస్వామ్య విధానానికి ప్రతీకగా అనిపించింది

నిజంగా ఉన్నప్పటి మునిసిపలు సమావేశాలూ, చర్చలూ, కొన్ని శాసనసభా కార్యక్రమాలూ నాటకవత్ గా ప్రహసనవత్ గా జరుగుతూన్నాయనే భావన కలుగుతూన్నపుడు యథార్థము కాని ఈ కౌన్సిలు సమావేశాన్ని నాటకం అనడం అంత మహాదోషమా అనిపించక మానదు మాజీకౌన్సిలర్లూ, చైర్మన్లూ (నమూనా కౌన్సిలు సభ్యులు) నిజమైన కౌన్సిలర్లూ నిజమైన చైర్మన్లూ భవిష్యత్తులో కావడానికి ఏకాలదిగానో గొప్పగానో అవకాశం ఉంటే ఉండవచ్చుగాని నమూనా కమిషనరుగారు నిజమైన కమిషనరు అయే అవకాశం బహుశః ఈ జన్మలో ఉండకపోవచ్చు అందుచే వారికిది నాటకంగా భాసించడం అసహజం కాదు. మొత్తంమీద ఈ సమావేశ కార్యక్రమం మహావివాదములకు దారితీయకుండా వినోదప్రాయంగానే సమాప్తం కావడం అభినందనీయం అనక తప్పదు

— ••—

# ఉద్గ్రంథములు

1) నిర్వచన మహాభారతము (పదునెనిమిది పర్వములు) రు 50—00
2) నిర్వచన అధ్యాత్మ రామాయణము రు. 20—00
3) నిర్వచన మహాభాగవతము రు. 30—00
4) శ్రీ వేంకటేశ్వర విజయము రు 25—00
5) కుందమాల నాటకము రు. 5—00
6) వేణీసంహార నాటకము రు. 5—00
7) శ్రీ వాల్మీకి రామాయణము మొదటి సంపుటము రు. 30—00

కృతికర్త ప్రకాశకుఁడు
బులుసు వేంకటేశ్వరులు, ఎం. ఏ.
8-22-14, గాంధీనగర్, కాకినాడ-4.

# రచయితలకు మనవి

సంక్షేపముగను, సౌమనస్యముతోఁ గూడినవిగాను, నుండు విమర్శనాత్మక రచనలకు స్వాగతము గ్రంథవిమర్శకు ప్రాముఖ్యము ఔచిత్యము మీఱని అభిప్రాయ భేదములకు సముచిత గౌరవము. వాఙ్మయమునఁ జేరఁదగు వివిధాంశములపైఁ దమ రచనలు పంపి మాకుఁ జేయూతనీయఁ బ్రార్థన రచనలు సరళగ్రాంథికములోఁ గాని, శిష్టవ్యావహారికములోఁగాని యుండవచ్చును. సలక్షణములు రసవంతములు నగు పద్యరచనలకు ప్రత్యేక స్వాగతము.

వివాదాస్పదములుగాని, చట్టబద్ధమైన, మత, రాజకీయ, ఆర్థిక, శాస్త్రీయ విజ్ఞాన, పారమార్థిక, సాహిత్యాదులకు సంబంధించి వివిధప్రక్రియలకుఁ జెందిన ఏవిషయములమీఁది రచనలనైనఁ బ్రచురించుట మా యభిలాష

రచన మాకుఁ జేరిన కొలదిరోజులలోఁ బ్రచురణకు స్వీకరించిన విషయము రచయితలకుఁ దెలుపఁబడును. స్వీకరింపఁబడని రచనలు త్రిప్పిపంపుటకు తగిన తపాలాస్టాంపులు రచనలతోపాటు పంపవలయును.

క్రొత్తపుస్తకములను రెవ్యూకి పంపువారు రెండుకాపీలు పంపఁగలరు పంపఁబడిన ప్రతి పుస్తకముమీఁదను వీలయినంతవఱకు రెవ్యూ ప్రచురింపఁబడును.

— ఎడిటరు

అడ్రసు —
సంపాదకుడు, బులుసు సీతారామశాస్త్రి,
రిటైర్డు తెలుగు లెక్చరరు, వి. టి. జె. కాలేజీ,
6-8-7, ఇన్నీసుపేట (త్యాగరాజనగర్), రాజమండ్రి-1.

Editor, Printer and Publisher B Sitharama Sastry, Printed at B V & Co , Press, Innispet, (Tyagaraja Nagar) Rajahmundry-1